# స నా త న సా ర థి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 15 జనవరి '73 సంచిక 12

విషయానుక్రమణిక

—:చిత్రము:—

" అజం, అవ్యయం, నిత్యం, అవినాశినం "



—:శ్రీ వారి కార్యక్రమములు: —

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు ఎడిటర్ సనాతన సారథి, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండతాలూకా అనంతపురం జిల్లా, అనే విలాసమునకు రిప్లయిపోస్టుకార్డు రిప్లయిపెయిడ్ టెలిగ్రాంగాని పంపితే కొత్తచెఱువు 30 PCO ఫోన్ చేసితే తెలుపగలము

చందాదారులకు విజ్ఞప్తి

TC 8721 నుండి TC 9687 వరకు

మీ రసీదు కార్డుల్లోను ఈ పత్రికలోని మీ విలాసపు కాగితములోనూ మీ చందా గడువు ఏ సం॥ ఏ నెలవరకు, అని తెలుపే నంబర్లున్నవి, గమనించండి. మార్చి '73 సంచిక నుండి మీరు క్రొత్త చందాలు కట్టవలసి యున్నచో (ఇదివరకు పంపని యెడల) ఫెబ్రివరి 15 తేదీలోపల, (సం॥ రూ 4 )కార్యాలయము చేరునట్లు పంపవలయును.



# రామకథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

**36**

## సీతకు నవ్వు

రాముడు సీతకు కర్తవ్యములను బోధించుచుండగా సీతకు పట్టరాని నవ్వువచ్చినది. ఒకవైపున తనకు సిగ్గు వేసినది. అంతటితో తాను వూరకుండక, రామా! తాము దశరథమహారాజు పుత్రుడవై, ఇంత చాటు మాటలు చెప్పుట నేనిదివరకెన్నడునూ వినలేదు; తల్లి తండ్రి తోబుట్టు, కొడుకు, కోడలు మొదలయిన వారందరూ వారు వారు చేసుకొన్న పుణ్యపాపములనుపట్టి శుభాశుభములననుభవింతురు, భార్య ఒక్కతే భర్త అనుభవించే శుభా

శుభములతో భాగమును వహించుదును, అనుభవించుదును దశరథమహారాజు మిమ్ములను అడవికి పొమ్మన్నాడన్న నన్ను కూడనూ పొమ్మన్నట్లులనే, అడదానికి త తండ్రి పోషించగలరు; కొడుకు ఆదరించ గలడు. చెలికత్తె సేవించ గలదు అంతేకాని వారు నాకు దిక్కు కారు.

మీరు పలుకు పలుకులు నాకునవ్వు పుట్టించుచు న్నది, పెండ్లి కాక పూర్వమే నాకు నాతండ్రి సర్వ ధర్మ ములనూ బోధించెను, నేను అజ్ఞానురాలును కాను; లేక స్వార్థపరురాలను కాను; అంతకంటె మొండితనము నాకు లేదు, సర్వధర్మములూ తెలిసిన నాకు మీరు ప్రత్యేక ధర్మములు చెప్ప నక్కర లేదు.

నేనిక్కడున్నకదా అత్త మామ, మరది, ప్రభువు లను యేరీతిగా ఆదరించాలి సేవించాలి అని యోచించ వలెను? నేను మీతోనేవుండునపుడు ఇతరులను సేవించ వలసిన పని నాకేమున్నది? మీరు చెప్పనవసరమేమున్నది. నేను ఆనందముగా మీతో బయలు దేరి వత్తును.

తీరని ఆశ

అరణ్య వాసము చేయవలెనని నాకు యేంతో కాలమునుండే వకతీరని ఆశకలదు, అది ఈనాడు నా పతిదేవునితోనే ప్రాప్తించుట నా అదృష్టము. మీరు ఈ

విషయమున రాకూడదని శాసించిననూ నేను విననను; నా మాటవిని లేదని మీరు కోపగించకుడు; త్రాగి పారబోసిన నీరువలే నన్ను ఇక్కడ విడచి పోవుట మీకు నీతికాదు, నా మాట మీరునమ్మండి. నేను వక్క క్షణమైనా అయోధ్యలో వుండను; మీవేంట తీసుకొని పొండు.

అని పాదములు పట్టిప్రార్థించెను. మీకు పట్టాభిషేకము జరుగలేదే అను చింత నాకేమాత్రమునూ లేదు. నాకుమీరు ప్రధానముకాని రాజ్యాభిషేకము ప్రధానము కాదు మీరొక్కరున్న అదే నారాజ్యము, అదేనాభాగ్యం. అని బ్రతిమలాడినది. అంత రామచంద్రుడు. అడవులన్న సామాన్యము కాదనియూ అందులో క్రూరమృగములు, రాక్షసులు మహాగజదొంగలు చేరియుందురనియూ అంతే కాక నదులు దట్టమైన పొదలు దాటవలసి వచ్చుననియూ నీవు యేనాడు నడచినదానవు కావు కనుక చాలాశ్రమ పడవలసివచ్చును అని అనేకరకముల, రాముడు అడ్డు చెప్ప జొచ్చెను.

సీతలశించే సేవ

అంత సీత! ప్రభూ యెట్టి క్రూరమృగములున్ననూ యెంతటి దట్టమైన అరణ్యమయిననూ మీరు వెంటవుండగా అవినన్నేమి చేయును? అరణ్యములలో పయణము చేయుట నాకు బాగుగా తెలుసును, అవి నాకేమాత్రమూ

బాధనందించవు. నేనేముందు నడచుచూ మీకు దారియేర్ప రచవలెనన్ననూ మరింత సంతోషముతో ముండ్లు రాళ్ళు కంపలు ఏరి పారవేసి మీకుహాయిని కలిగింతును. అట్టి సేవచేయుటకైననూ నన్ను మీవెంట గొనిపొండు ఈ అయోధ్యా అంతఃపురమున నాకిట్టి సేవలభించలేదు; అన్ని సేవలు దాసదాసీలు చేయుచుండ, నేనెంతయో విచారించుచుండెడిదానను.

దాస దాసీలు లేని ఆ అరణ్యమున నాప్రభుసేవ నేనే చేయవలసి వుండును; అది నా భాగ్యము, అట్టి పవిత్ర అవకాశమును నాకందించి ధన్యురాలను చేయవలెనని, పరిపరి విధముల ప్రార్థించు సీతను చూచి, రాముడు జాలి నొంది,

సీతా! నీవుచెప్పినటుల అక్కడ నివసించుటకు కాదు; ఆ నాడు నీవు బాధపడవలసి వచ్చును; యోచించుకొమ్ము, అనిరాముడుఅనేక రీతుల తెలుపెను. అంత సీత, రామా! మీవ్రతమునకు నేనెట్టిభంగమునూ కలిగించను. మామాటల పట్టి మీరేదియో దాచుచున్నటుల కనుపించుచున్నది. నా దగ్గర గుట్టెందుకు? మీతో పాటు వనమధుగంధ వాసనలు ఆఘ్రాణిస్తూ, కందమూలాదులను భక్షించి నీమముతో బ్రహ్మచారిణీ వ్రతమును పాటింతును.

యేంతమందినో కాపాడు ఇలకులపతికి నన్ను కాపాడుటచేతకానిదా? నేను నమ్మను! నాకదికావాలి ఇవి కావాలని మిమ్ములను బాధింపను. మీకు యేట్టి శ్రమనూ కలిగించను. అందించను. ప్రభూ! నేను మీతో రాక తప్పదు. మీ పాదముల చెంత పవళింతును. అది నాకు పరమానందముచేకూర్చును. రామా! మీరుతప్ప నేను అన్యులను యెరుగను; మిమ్మలను విడచి నిమిష ముండను; వుండలేను. అట్లుమీరు పట్టుపట్టి నన్ను అయోధ్యలో వదలి వెళ్లితిరా, మీరు అరణ్యముచేరక పూర్వమే సీత ప్రాణములతో వుండదు; ఇది పరమ సత్యము.

భరించటము భారము

అని కన్నీళ్లతో కలక పారిపోయినవి. అపుడు రాముడు ఆమెను సమాధానపరచుచూ, ఓ సీతా! నీవు మహాకులీనవు. ధర్మిష్టవు. నీవు నీ ధర్మము నాచరించుచూ ఇక్కడనే యుండుట మంచిది, నీవు నీకు తోచినటుల చేయకూడదు, నీకు ఇష్టమోచ్చినటుల చేయకూడదు, నీకు ఇష్టమొచ్చినటుల చేయుటకు స్వాతంత్ర్యములేదు నేను చెప్పినటులనే వినవలసియుండును. కాన నీవిక ఈ అలోచనను వదలుము నీమంచికే నేను చెప్పుచున్నాను

నిన్ను భరించటము నాకు అతి భారము. పెద్ద పెద కొండలనుండి జారిపడె శెలయేళ్లు, కొండగుహలలో

నివసించు క్రూరమృగముల గర్జనలు మహాభయంకరంగా వుండును; సింహశార్దూలాది మృగములు విచ్చలవిడిగా సంచరించుచుండును; నదులు దాటి పోవలసియుండును; పెద్ద పెద్ద గుండ్లూ, బండలనుంచి ధుముకవలసి యుండును; ఇట్టి యిబ్బందులన్నియూ యోచించితే నీకు ఇంతగట్టిగా చెప్పవలసి వచ్చెను.

జటలు ధరించి వల్కలాలు కట్టుకొని ఋషుల జీవితమును గడుపవలసి యుండును. మేము సంధ్యావంద నములాచరించువేళ నికెట్టి అపాయములైనా సంభవించ వచ్చు. మేము యెట్టి ఆపదలందునూ ఆ నీమమును వీడ మన్నది నీకు బాగుగా తెలియును. యేసమయము మెట్లుండునో చెప్పలేము.

సీతకు భయమెందులకు?

అని రాముడు అనేకరకములు భయపెట్టుమాటలకు సీత యేమాత్రమూ వెరువక. రామా! పల్లెపడచులకు, శాస్త్రహీనులకూ, అజ్ఞానజడబుద్ధులకూ చెప్పినటుల నాకు నూ చెప్పనక్కర లేదు. మీ శక్తి సామర్థ్యములు నేను బాగుగా యెరుగుదును, మీకు చేతకానివంటూ ఈలోకము నందేకాదు, పదునాలుగు లోకములందునూలేదు. అట్టి మీరు నా వేంటనున్న, నాకు భయమెందులకు, పోనీ! నేను యేక్రూరమృగములనోటనో పడితినన్న తమసన్నిధిలో

ఆనందముగా ప్రాణములు విడుటకు నేనుసంసిద్ధమే; కాని, నీవులేని జీవితాన్ని నేనంగీకరించను.

సీత రాముని అర్ధాంగిని

నాకు ఇష్టమొచ్చినటులచేయుటకు అధికారము లేదని, అంటిరి. ఇదిమీకు తెలిసి చెప్పితిరా? లేక నన్ను మోసపుచ్చుటకు ఆడినమాటలో, నాకర్థమగుటలేదు! మీకుయేయే హక్కులున్నవో అన్ని హక్కులూ నాకునూ వున్నవి నేను అర్ధాంగిని, మీదేహములో సగభాగము నాహక్కు; నా దేహములో సగభాగము మీహక్కు అంతే కాని మీకు మీరుస్వతంత్రులు కారు. నాకు నేను స్వతంత్రురాలను కాను, నా విషయమున మీకెంతటి అధికారమో, మీ విషయమున నాకంతటి అధికారము కలదు

అయితే నేను అధికారమును పట్టి వాదించుటలేదు మీ అండదండలనుకోరి ఆడుచున్న మాటలివి: అని గట్టిగా పలికిన సీతపలుకులకు రాముడు మరింత, గట్టిగా.

సీతా! నీవు హక్కుల విషయములలో చిక్కులు పడుచున్నావు. నేను అరణ్యమునకు వెళ్ళుటచేత. వృద్ధులైన నాతల్లిదండ్రులు, నాకొరకై విలపించుచుందురు. అట్టి సమయమున నీవు అత్తమామల మనస్సును కనిపెట్టి వారలకు తగిన సేవలు చేయుచూ, ధైర్యమును తెలుపుచూ వుండుట నీ కర్తవ్యము.

కౌసల్యా శోకబోధ: సీత శోకబోధ

సమయమును పట్టి మెలుగుట మంచిది. వారల చెంతవుండి వారిని సేవించు; అదే నాకు ఆనందము, అని రాముడు నిర్ధారణ చేసినటుల శాసించెను. అందుకు సీత చిరునవ్వు నవ్వి రామా! కన్నకొడుకే అమ్మనాన్నలను కఠినదుఃఖమున ముంచి తనపట్టే భల్లూక పట్టుగాభావించి సర్వమునూ త్యజించి అడవులకు వెళ్ళుచుండ పరాయి యింటినుండి వచ్చిన కోడల్లు అత్తమామలను వోదార్చుటలో బాధ్యతుండునో, మీరే యోచించుడు! కన్నకొడుకును వీడలేక కారడవులకు తానుకూడా వత్తునని కన్నీలు కాయలు కాచునటుల యేడ్చినను ఆమెకు పతి సేవనే ప్రధాన కర్తవ్యమనియూ, కన్నకొడుకు ప్రేమపై, కట్టుకొన్న భర్తను వదలివచ్చుట ఇక్ష్వాకువంశమునకే తీరని అపకీర్తి అని మహా మహా ధర్మములు కౌసల్యకు భోధించి, ఇపుడు నా చెంతకు రాగానే, నాకు అత్తమామల సేవనే కర్తవ్యమని బోధించుటలో, యేది సత్యమో మీరే యోచించుడు.

సతికి పతి దైవమన్నది, వక కౌసల్యకేకాదు; లోకములోని సమస్త స్త్రీజాతికే కలదన్న సత్యమును మరచిరి, కాబోలు! కౌసల్యకు చెప్పిన నీతులు నాను మాత్రము యెందుకు అన్వయింపవో చెప్పవలెతిరి.

మీరెన్ని చెప్పినను, నేను పతిజాడనువీడను. మీ మాటను మీరుచున్నానన్న కోపముతో నన్ను వధించిననూ సంతసింతును, కానీ, మిమ్ము వీడి వుండలేను.

న్న నాటి కథ

రామచంద్రా! మీరు వనవాసము చేతునని చెప్పిన తోడనే, నా చిన్ననాటివిషయము నాకు తలపుకువచ్చి యెంత వుప్పొంగితినో, మీకు తెలియదు. నాకు పెండ్లికాక పూర్వము మాతల్లి నన్ను వడిలోకూర్చొనబెట్టుకొని, నా సీతకు యెట్టిభర్తరాగలడు? (నాతల్లి మహా సాధ్వీమణి రాలు) అట్టి సద్గుణ సంపన్నుడు చిక్కునోలేదో, అని నా తలనిమురుచూ యోచించుచుండ, వకానొక తాపసాంగన అంతఃపురమునకువచ్చి అమ్మను చూడగోరుచున్నదని దాసి వచ్చి తెలుపగనే, అమ్మ నన్ను ప్రక్కకుతీసి, తేచి వెళ్ళెను. అప్పుడే నేనుకూడనూ అమ్మజతలో వెళ్లితిని. తాపసాంగనకు నా తల్లి నమస్కరించి, నన్నుకూడనూ నమస్కరించమని కోరెను. అమ్మ అజ్ఞను శిరసావహించి నమస్కరించగా, ఆ తాపసాంగన నన్ను మనసారచూచి, అమ్మా! మీ బిడ్డ పతితో వనవాసము చేయును, అనిచెప్పెను.

అంత మా తల్లి, పెండ్లియే కాలేదు. పతితో వెళ్లు ఒకర్కడ? అని పక్కన నవ్వగా: కాదు, కాదు, పెండ్లి

అయిన తరువాత - పతితో కొంతకాలము వనములందు నివసించవలసివచ్చును, అని గట్టిగాచెప్పి వెళ్లెను.

ఆనాటిమొదలు నేటివరకూ పతితో వనములకు వెళ్లుట యెప్పుడు? అని ఉవ్విళ్లూరుచున్నాను! అట్టి నా చిర కాలవాంఛ నెరవేర్చి నన్నానందపెట్టుడు, అని పాదంబు లపైబడి, ప్రార్థించు సీతనుచూచి,

రాముడు జాలిగా, ప్రేమతో సీతను లేవనెత్తి "సీతా! నాలోని రహస్యమును నీకుచెప్పక మరెవ్వరికితెలుపుదును? వినుము! నీవు చిన్నవయస్సుదానవు. అడవులలో అనేక మంది ఋషులూ మునులూ వుండుటచేత నేను వారలను సేవించుటకై వెళ్ళవలసియుండును. అప్పుడు అక్కడికి అనేకమంది రాజపుత్రులు రాజులూ వేటకైవచ్చి ఆశ్రమములను సంపర్శించుటకు వత్తురు. అట్లువచ్చినప్పుడు వారల దృష్టి నీపై పడవచ్చును. తదుపరి అందునిమిత్తమై చేయు ప్రయత్నములు అనేకముగా జరుగవచ్చును. కాన. నేను తాపస వేషమున నుండుటచే వారలతో తగవులు పెట్టుకొనుట మంచిది కాదు. ఈ కారణములననుసరించి యైనను నీవు అయోధ్యలో వుండుము!

అని రాముడు చెప్పుచుండ: సీత "రామా! మీరు సామాన్య మానవులవలె ఇట్టి కట్టు కదలను చెప్పి నన్ను వంచించుట న్యాయముకాదు. మీరు ప్రక్కనుండగా సురేశ్వరుడు సహితము నావంక కన్నెత్తి అయినను

చూడలేడు. అట్లుచూచెనా,.. తాను అక్కడనే భస్మమై పోగలడు. ఈ మాటపైననూ నన్ను మీవెంటగొనిపోక తప్పదు. యెందుకన, మీరు నా వెంట వుండకుండిన, నేను వంటరిగా అయోధ్యలోవుండిన, అట్టివి సంభవించు నేమో? లేదా; నేను ఇతరుల ఆనందమునుచూచి, ఓర్వలేక బాధపడుదునేమో? కాన. నన్నువంటరిగా వదలక జంటగా గొనిపోవుటలో మనయిరువురి పేరు ప్రతిష్ఠలూ జగద్వ్యాప్తిగాగలదు.

చంద్రుడు -- వెన్నెల

అంతేకాదు. "రామా! నీవు రామచంద్రుడవు! నేను సీతాజాతను; అనగా చంద్రునినుండీ వెలువడిన చల్లని శీతలవెన్నెలను. చంద్రుడు అరణ్యమందును వెన్నెల అయోధ్యయందునూవుండ వీలుండదు కదా? చంద్రునిలో వెన్నెల కూడియేయుండును; కానీ, వియోగము సంభవించదు. ఈ రెండింటికీ నిరంతర సంయోగమేకానీ, వియోగముసంభవించదు. సంభవించెనా అది యేదో ప్రళయసమయము అయివుండవచ్చును; లేదా దుష్టసంహారమునకై శిష్టపరిపాలనకై అట్లుజరుగ వచ్చును. ఈనాడు అట్టివేవియూలేవుకనుక. మనయెడ బాటు వీలుకానిది. జరుగలేనిది, అని దృఢపలుకులు పలుకెను, సీతామాత!

( సశేషము )

# క వి తా ం జ లి

ఎవ్వడు నీకథామృతము నింపెసలారగ జుఱ్ఱునో--సదా
యెవ్వడు నీపాదాబ్జముల నేమరకుండ భజించునో --యతం
డెవ్వడటన్న పరీక్ష యుదయింపగనీక, వసుంధరన్ ప్రభుం
డెవ్వడు పొందనట్టి సిరినిత్తువు నిత్యము సత్యసాయిజీ!

మానవజన్మమెత్తి, మతిమాలిన వంకరబాటలందు, న
జ్ఞానమదాంధులై తిరుగు జాల్ములకీవొక దివ్వెవౌచు, కా
లూనితివయ్య -- నీ రిచత మున్నతమైనది తండ్రీ -- నీకథల్
గానమొనర్తులింక --దయగావుము మమ్ము శుభములిచ్చుచున్

దానవశక్తి ( దుంచగల ధర్మవు నీవు -- నిరంతరమ్ము దుం
ఖూనిల సంసృతిన్ వ్యధలనందెడి వారికి వేణువీవు -- "చి
త్రానది" తీరవాస ! భువిదర్శనమిచ్చితివయ్య -- విశ్వక
ల్యాణము గర్వగానిటుల -- .నారయలేము భవద్విశేషముత్

ఒరులకు దోచని భావము___
లొరులకు స్ఫురియించనట్టి యుపమలు --భువిపై
నొరులెరుగని మర్మములు
విరియునుగద తండ్రి ! నీవు పెదవిని విప్పన్

ఒకొ్క్క క్షేత్రరాజము నొకొ్కక్క మతంబునకున్ బవిత్రమై
మ్రొక్కులగాంచుచుంపుటది లోకమునందు ననుశ్రుతంబు, ...నే
డిక్కడ -- "పుట్టపర్తి"-- ప్రజలెల్లరకున్ భేదశూన్యమౌ
చక్కని తీర్ధఘాటయది --సాయి ! భవన్మహిమంబు గావొకో!

రంగిపీని సత్యనారాయణరాజు

# పండితులకు!

దివ్యాత్మ స్వరూపులారా అందుకొండి ఆశీర్వాదములు

ఆత్మజ్ఞాన మనిన, ఆత్మయొక్క నిజస్వరూపమును తెలుసు కొనుటయే; దీనికి పవిత్ర ప్రయత్నము, విశ్వాసము, వినయము, సత్ శీలము, అన్నీ అత్యవసరము. ఆత్మానుభవము లేని జీవితము సుఖజీవితము కానేరదు. ఆనందము నందిం చదు. పర్వతోపమమైన ఆధ్యాత్మ గ్రంథలమ పఠించిననూ, పండితాగ్రగణ్యుడను ప్రతిష్ఠపొందిననూ, ప్రయోజనమేమీ వుం డదు; ప్రశాంతిలభించదు; ఆనందము అందని పదార్థముగనే నిలచి పోవును. పరమాత్మని గుర్తించి, దానిలో లీనమై చిరసుఖశాంతులను సంపాదించటమే మానవుని ఏకైక లక్ష్యము.

ఆ లక్ష్యమును సాధించవలెనన్న, నిరంతర సాధనకు పూను కోవలెను. భగవంతుడు కరుణతో ఈ ప్రయత్నము నకు కావలసిన చైతన్యమును మానవునికి ప్రసాదించి యున్నాడు. అపారమైన చిత్ శక్తిని అనుగ్రహించి యున్నాడు. ఆ చిత్ శక్తిని క్రియాశక్తిగా మార్చి ఆ మూలకముగా జ్ఞాన శక్తిని పొందవలెను. ఇదే సాధన.

మానవుడు మట్టికాదు, మాంసపు ముద్దకాదు. వాడు అమృత పుత్రుడు; ఆనందముయొక్క సెలయేరొకటి వాని

హృదయములో వున్నది. వ్యక్తి అంటే. అంగాంగములు సంయోజన కాదు; ఆనందపిపాసను తీర్చుకొరకు ఆవేదన ననుభవించి అది లభించువరకూ అసంతృప్తితో అల్లాడే జీవి వ్యక్తి.

అపార సంపత్తినుంచి కానీ, స్థానమానములు పేరుప్రతిష్ఠలవలన కానీ, ఆస్తిపాస్తులవలన కానీ, పాండిత్యమువలనకానీ ఆనందము చేకూరదు; లౌకిక ఆనందము భౌతిక ఆనందము తుచ్ఛమైనది, క్షణికమైనది. అయితే ఆట్టి ఆనందమే చాలు అని దానితోనే సంతుష్టిపొంది మానవుడు ఆ భ్రమలోపడి, జీవితమంతా ఆ ఆనందమునకై పోరాడు చున్నాడు; దీనుడై ఆత్మగౌరవమును నష్టముచేసుకొని భంగపోతున్నాడు. ఇవన్నీ వాని అజ్ఞానముయొక్క దుష్ఫలితములే.

మానవుడు తాను జన్మించే తరుణమందు రిటర్న్ టిక్కెట్‌తోనే వచ్చుచున్నాడు. జీవితకాలమంతయూ, ఆర్జించి వ్యయము చేసి, ఆడుతూ పాడుతూ, పడుతూ లేచుచూ కాలమును వ్యర్థము చేయుచున్నాడు. తన జీవితముయొక్క పరమోద్దేశమునేగమనించడు. అయితే, తాను మాత్రము చివరస్థానమైన శ్మశానమునకు ప్రయాణమును నిరంతరముసాగిస్తూనేంటాడు.

ఈరీతి జనన—మరణములనే రంగులరాట్నముతో తిరుగేచి మానవునికి యే మాత్రమూ భూషణము కాదు. తనలోని వివేక వైరాగ్య విచక్షణలను ప్రకటించి ప్రకాశింపజేసి. మానవుడు ఈ జన్మము అనే రాట్నము నుంచి తప్పించుకోవలెను. ఇదే

బుద్ధిమంతుల లక్షణము. లక్ష్యము. పుటిన తరువాత గిట్టక తప్పదు. అయితే, ఆ గిట్టటము, మరణమునకు పూర్ణవిరామ ముగా నుండవలెను. చచ్చితే. మరి బావు రాకూడదు, అంటే, జీవితాంతమునకు మునుపే, సాధనలద్వారా, ఆత్మ తత్త్వముయొక్క రహస్యమును తెలుసుకొని, నిత్యానందమను అందుకోవలెను.

అట్లచేయక పుట్టిన తక్షణమే విలపించిన వాడు, చచ్చే క్షణములోనూ విలపించుచూ బయలుదేరితే, కేవలము హాస్యా స్పదమే కానీ టన్‌కట్టిళ్ళ ఆహారమును ఆరగించి శరీరమును పెంచి భూమికి బరువు నెక్కించి బాధకలిగించిన వాడగును.

కోహం కోహం అని పుట్టినవాడు, మరణించునపుడు సోహం సోహం అని ఆనందించవలెను. దుఃఖములు కష్ట నష్ట ములు వీటిని యెవరూ స్వాగతించరు, ఆశించరు; అయితే, అవి రాకతప్పదు మానవుని అభిలాష ఎట్లవుండిననూ, అవి కర్మాను సారముగా వచ్చేతీరును, బాధనిచ్చేతీరును. తారుణ్యముదాటి, ముదిమిప్రారంభమయినప్పుడు, మరణభీతికి గురియయ్యేది సహజ మైనది, తప్పనిది, దీనికి నివారణోపాయమేలేదు; జీవితము ఒకకల; కలలోనిసుఖమునిజముకాదు; కలలోనిబాధకుమందులేదు; అయితే, మేలుకొన్నతక్షణమే ఆబాధతీరును, కలలోని సుఖము దుఃఖము, నవ్వు యేడ్పు, అన్నీ వట్టిభ్రమలు అని అపుడు తేటతెల్ల మగును. ఆత్మజాగృతిపొందిన తక్షణమే, జీవితమనే కలలలోని

సుఖదుఃఖ సమ్మిశ్రమమైన ద్వైతభావములన్నీ మాయమై పోయినీయును.

ఉన్నతి అవనతి రెండింటికీ మనస్సేకారణము. అవివే కులకు వారిమనస్సు భయంకరమైన భూతము: వివేకులకు వారిమనస్సే దేవదూత: కలుషిత మనస్సు యెపుడూ భయభీతులతో కంగారుపడుచుండును. సాధనలచే కల్మషమును తీసివేసిన, అది శుద్ధమై పవిత్రమై, మానవుణ్ణి అవధూతస్థానమునకు గొనిపోవును వేదోపదేశమంతా ఈఫలసిద్ధికొరకే చేయబడినది. మనోవాంఛలనూ చేష్టలనూ తీర్చిదిద్ది పరిపూర్ణతను అందించేదే వేదబోధయొక్కగురి.

జగత్తులోని ప్రతి సంభవమునకూ సంఘటనకూ కారణ ముండేవుండును. ప్రతిజీవిని, వస్తువును, కార్యమును నిర్మించి నియంత్రించి నియమించుశక్తి యొకటివున్నది. కాని అది అగో చరము, అదృశ్యము. ఆ శక్తిని దర్శించువిధానము, తెలుసుకొనే వుపాయము వేదశాస్త్రముల నర్థముచేసుకొని ఆచరణలో పెట్టితే అందరికీ హస్తగతమగును.

అయితే, అట్టి విలువగల శాస్త్రములను ప్రక్కకునెట్టి, అధికారమదమువలన అహంకారపీడితుడై తాను నడచినదే మార్గము, పలికినదే సత్యము, అడిగినదే న్యాయము, చూచినదే నిజము అని సాహసించి అధోగతినొందుచున్నాడు, మానవుడు. భారతీయసంస్కృతియొక్క మహత్త్వమేమి, దానిలో ఇమిడియున్న అత్యున్నతభావముల మహిమలేమి అని గుర్తించి వర్తించక, ఇవి

తమునే పాడుచేసుకొంటున్నాడు. తత్ఫలితముగా, శాంతి అనేది వ్యక్తియొక్క హృదయమునుంచి, సమాజక్షేత్రమునుంచి, జగత్తుయొక్క పరిమితినుంచి పలాయనమైనది.

ఈ దినము ఇచ్చట సమావేశమైన ప్రశాంతీవిద్వన్ మహాసభాసదస్యులు, విద్వాంసులు పండితులు అందరూ, సామాన్య జనులకు ఆత్మతత్వమును బోధించి, సనాతనధర్మము భారతీయ సంస్కృతి వీటిగొప్పతనమును వివరించి, దానిలో శ్రద్ధాభక్తులను పెంచి పోషించి అభివృద్ధిపరచి, వేదశాస్త్ర వుపనిషత్తులు పురాణేతిహాసములు వీటిసారమును వారికి అందించి, వారిని ప్రజ్ఞావంతులు గావించవలసియున్నది. తామే స్వతః ఆదర్శప్రాయులుగామారి, ఆచరణశీలురుగా తయారై, సత్-చిత్-ఆనందస్వరూపుడైన పరమాత్మని సాక్షాత్కరించే విధానమును అనుభవరూపముగా ప్రబోధించవలెను.

మీరందరూ ప్రతి హృదయక్షేత్రమందునాసత్యబీజములను నాటి, వాటిని పోషించు విధి విన్యాసములనూ రీతినీతులనూ బోధించి, దేశకల్యాణమునూ లోకకల్యాణమునూ సాధింతురని ఆశీర్వదించుచున్నాను.

బాబా

[సిద్ధాపురములో జరుగిన పండితసన్మానసభకు శ్రీవారు అందించిన ఆశీర్వచనములు]

# పవిత్రం! విచిత్రం

భగవాన్ ప్రేరణతోనో యీ పుత్తరం వ్రాయటం జరిగింది. నేను శిశురోగ విభాగంలో పనిజేసే ఒక హౌస్ సర్జనును ఎనిమిది రోజుల క్రితము, ఒక శిశువును మా విభాగమునకు తీసికొని వచ్చిరి. ఆ శిశువు మయోకార్డిటీస్ (గుండెకండరవాపు) తో కూడిన డిఫ్తీరియా (అనగా గొంతు వాపు ముక్కు రంధ్రముల పై పొరవంటు ఊపిరాడ కుండా జేయునట్టు మహా భయంకరమైన అంటువ్యాధితో) ఊపిరాడక కొట్టుకొంటూంది అందువలన అతి త్వరగా ముఖ్య శ్వాస నాళము (Trachea) లో ఊపిరికై ఒక రంధ్రము నేర్పరచ వలసి వుంది. అట్లా చేశాము.

యీ సాయంకాలము శిశువు మరలా అత్యంతా వేదనకు గురికావటం వలన అడ్డుకున్న శ్లేష్మాన్ని వెంటనే తొలగించ వలసి వుంది. దురదృష్టవశాత్తూ మా విభాగంలో వున్న (Sucker) శ్లేష్మమునుతీసే యంత్ర పరికరం చెడిపోయినది. అందువల్ల నేనూ నా (E N T.) విభాగం స్నేహితుడూ కలసి ఆ బిడ్డను శస్త్రచికిత్సా విభాగానికి తీసికొని వెళ్ళాము. ఎందువల్లననగా ఆ సక్కర్ (Sucker) అక్కడ లభించ గలదని.

హటాత్తుగా కొంతసేపటివరకూ అక్కడ బాగానే పని జరిగింది, కాని శిశువుకు ఊపిరి నిలచిపోయింది. గుండెకూడా

ఆగిపోయింది. వెంటనే మేము అడ్రినలిన్ ఇంజక్షన్ కొరకు సిరింజ కోసం వెతికినా అక్కడ కనబడలేదు. సిరింజిక్కడ లేదా? కాదు, మేము వెతికినాము కాని, మాచేతులు దానిని అందుకో లేకపోయినవి ఇంతలో (Sucker) ఆ పీల్చేయంత్రము పని చేయటం మానివేసింది.

ఏమాత్రం జీవచిహ్నంలేకుండా తడిపిన బట్టలా శిశువు వ్రేల బడిపోయింది. ఆ నిరాశలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారిని తలచుకొంటూ నేను నిరంతరము నాతో తీసుకొని వెళ్లే విభూతిని ఆ శిశువు గుండెకు రుద్దటం మొదలు పెట్టెను. అప్పుడొక మహా ద్భుతము జరిగింది. అది నాలోకి జీవంతెచ్చింది. శిశువు కొద్దిగా కదలటం జరిగింది

కొద్దిసేపటికి గట్టిగా ఊపిరిపీల్చింది. నాస్నేహితుడు ఆనం దాశ్చర్యాలలో మునిగిపోయినాడు. బిడ్డ గుండెకూడ పనిచేయడం ప్రారంభించింది. కాస్సేపటికి కళ్ళు తెరచింది. ఆశ్చర్యముతో ఉక్కిరి బిక్కిరి అయిన మా కళ్లనుండి కన్నీళ్లు జలజరా రాలాయి, శ్రీ సాయిమాత, విశ్వజనని, బిడ్డను రక్షించి ఆ తల్లిదండ్రులకు మహానందాన్ని ప్రసాదించింది.

నేనుహాస్పటల్ కి వెళ్లేముందు జరిగిన కొన్ని సంఘటనలను కూడ చెప్పవలసివున్నది.

ఉదయపు సమావేశాలకు వేసుకొనే షర్టు వేసుకొని, అప్పటికే చాలా ఆలస్యమైనందువలన, కంగారుగా వున్నాను. వాకిలి దాటి వెళ్ళేముందు ఎందుకో యీషర్టు తీసివేసి, హాంగరునందున్న మరొక షర్టువేసుకోవాలని కుతూహలంకలిగింది. ఆకోర్కె ఎందుకో ఆపుకోలేనంత బలంగా ఎందువలన కలిగిందో చాలా విడ్డూరంగా వున్నది! వచ్చి ఆ షర్టు వేసుకొని హడావిడిగా హాస్పిటల్‌కు పరుగిడినాను.

మరణదేవత అట్టహాసంగా అరచేటప్పుడు బ్రితుకు బాటకు హాంగరునున్న షర్టులో భగవాన్ యిచ్చిన విభూతివున్నందు వలననే స్వామిదయవలన అనుకూలమైన మార్పులు జరుగింది. నాకు తెలియరాని ఏదోశక్తి నన్ను ఆషర్టుధరించుటకు ప్రోత్సహించింది! ప్రతిసంఘటన వెనుక అది ఎంత ప్రాముఖ్యములేని చిన్న ఘటన అయినప్పటికి, అది ఎంత హఠాత్సంభవమైనప్పటికి ఒకని గూఢార్థము తప్పక ఉండేతీరుతుందని తెలిసికొన్నాను.

"సందేహనివారిణి లో "కదలదు నాసంకల్పము లేవిదే గడ్డి పోచయును," అన్నారు, భగవాన్.

తరువాత "పరమం పవిత్రం బాబా విభూతిం, పరమార్థ యిష్టార మోక్షప్రదాతం" విముక్తినికలిగించేది, అద్భుతసంఘటనలకు కారణమయ్యేది, అద్భుతంగా సృష్టించబడినది అయిన విభూతి – యిదికేవలం ఒకపాట మాత్రమేకాదు. యీవాక్యాలిది యాంత్రికంగా ఉచ్చరించటముకాదు. యీనాటి ఆపరేషన్

ధి మేటిరుల్ వి అద్భుతసంఘటనా విషయానికి సాక్షిమాత్రుడనై, పరమాత్ముని విభూతిని స్మరించిన ఆనందాన్ని, ఆ "పవిత్ర తలోను ఆ "విచిత్ర" తలోను ఇంకపై మాట మాటకూ అను భవించి ఆనందించటానికి ఆతురితపడుతూ వుంటాను.

M. జగేష్ కామత్. M.B.B.S

11-12-72 మంగళూరు

అధరమించుక గదలిన అమృతధార
కరమొకింతగ కదపిన కల్పతరువె
పదములల్లన నడియాడ బాలగోప
బాలునృత్యమె యితడటే పర్తిబాబ

అల్ప బుద్ధుల మాన్పి మా ఆర్తిదీర్ప
రూపమును దాల్చి మా మనః తాపములను
దీర్ప వచ్చిన పరమేశ! దేవ దేవ!
శరణు శరణయ్య శ్రీ సత్య సాయి దేవ!

# “ఇవి పిల్లికి!”

భగవాన్ శ్రీసత్యసాయిబాబావారి జన్మదినోత్సవమును కండ్లా గాంచి ఆనందామృతమును గ్రోలవలెనని అస్సాంనుండి 108 మంది భక్తులు ప్రశాంతినిలయమునకు వచ్చిరి. వారందరికీ ఆశీస్సులను ప్రసాదించుటకొరకు 24వ తారీఖురాత్రి ఎనిమిది గంటలకు శ్రీ వా రా దే శా ను సా ర ము వారందరూ ప్రార్థనా మందిరములో జమఅయిరి. వారు ప్రశాంతినిలయమునకు వచ్చినపుడు రైళ్లల్లో పడిన యాతనలను అస్సాం బెంగాల్ రాష్ట్రములలోని భాషా గొడవలలను, తుపానువలన ఒరిస్సాలో గలిగిన భయ భీతులనూ, ఆంధ్రలోని సమ్మెలు బందులు, బంగాళాఖాతములో వాయుగుండమేర్పడనందున మద్రాసు దగ్గరవచ్చినపుడు వారు పడిన కుండపోతవృష్టినీ, వారుఅనుభవించిన కష్టములను, దయార్ద్రహృదయముతో శ్రీవారు పేర్కొని వారిగృహోన్ముఖ ప్రయాణము సుఖవంతముగా యుండునని అతికరుణతో దీవించిరి.

ఒకవైపున మొగవారు మరొకవైపున ఆడవారు బారులుతీర్చి ఆసీనులైయున్న, వారిమధ్యన స్వామివెళ్ళి అందరికీ పవిత్రమైన విభూతి ప్రసాదమును పంచిపెట్టిరి. వారిలో ఒకామెకు అందరికీ అందించినటుల గుప్పెడు విభూతి పొట్లములను ప్రసాదించి, కొద్దిదూరము వెళ్లి, ఆగి, తిరిగివెనుకకువచ్చి, బాబావారు ఆమెకు

మరి రెండు పొట్లములనిస్తూ "యే బిల్లీ కేలియె" అని సెలవిచ్చిరి.
నివ్వెరపోయిన ఆమెతో "యే బిల్లీ కేలియె" అని తిరిగి చెప్పిరి ఆశ్చర్యానందములో మునిగిన ఆమెకు, గౌహటినగరమున తనయింటిలోని పెంపుడుపిల్లి అప్పుడు గుర్తుకు వచ్చినది! అహేతుకదయాసింధు! ఏమి! ఆపిల్లిపై బాబావారి కెంత కరుణ! కృపాసాగరుడు! నిజము! దానిపై శ్రీవారికిగల కరుణను ఎనిమిది నెలల క్రితం బాబావారు ఆయింటిలో నిరూపించిరి.

గవర్నమెంటు ఆసుపత్రిలో మేట్రన్‌గా పనిచేయుచున్న ఆమె సోదరి, ఇంకమరికొందరూ ఆమెయింటికి విందారగించుటకు ఆ రాత్రి వచ్చిరి. వంటగదిలో జరుగుచున్నదాన్ని హాలులో కూర్చొని చూస్తూవున్న పెంపుడుపిల్లి హఠాత్తుగా ఒక చేప ముక్కను పట్టుకొని పరుగు తీసినది! కోపోద్రిక్తురాలైన ఆమె ఆపిల్లిని బాగా బాదినది.

ఆ సమయమున అయింటిలో గోడమీద, పూజాగదిలో, టేబిల్ పై. యున్న బాబావారి ఫొటోలు అన్నీ అటూ ఇటూ ఊగినవి! కొన్ని క్రిందపడినవి! కానీ యెందుకో పగులలేదు! భూకంపమే మోనని భయపడి, ఆమె అక్కగారూ మిగిలినఅతిథులు బయటకు పరుగిడిరి!

సాయిభక్తురాలైన ఆమె చాలావిచారములో మునిగినది తరువాత, భూతదయను గురించి తనకు ఒక గుణపాఠమును బాబావారు నేర్పదలచుకున్నారని, అనుకున్నది.

వణకుచున్న ఆపిల్లిని తనవడిలో పెట్టుకుని ఆమె దానిపీపును ప్రేమహస్తములతో నిమిరినది.

దానికున్న బాధను పోగొట్టుటకు బాబావారు దానిమీదజల్లిన సువాసనా విభూతి దానిశరీరముపై యుండుట ఆమె కనుగొన్నది: పశ్చాత్తాపముతో కంటినీళ్ళుకారుస్తూ, అమెఒళ్ళు భయ భక్తులతో పులకరించినది.

ఎనిమిది నెలల తరువాత ప్రశాంతినిలయంలో ఆ పిల్లికొరకే బాబావారు కరుణతో రెండు వీభూతిపొట్లములను ప్రసాదించిరి. ఆహా! ఆ పిల్లిచేసిన భాగ్యమెంత! శ్రీవారి దివ్య కరుణా పీయూష వర్షముయొక్క విచిత్రమెంత వర్ణనాతీతము!

(గాగోయ్)

కర్మవిపినమందు కన్నుమూసిచరించి,
కన్ను దెఱచినేడు గాంచినాడ।
నిన్ను దేవదేవ నిక్కమ్ముగానాదు
జన్మధన్యమయ్యె జగతియందు।

ప్రత్యక్షదైవ మీవని
సత్యమ్ముధ్వనించెనాత్మ। సాయీశ!, జగ
త్స్తుత్య! మదావృతకర్మము
నిత్యమ్ముగుగాకనింక నీస్మరణమునన్।

# జీసస్ క్రైస్ట్

మతములన్నియూ మానవుని మతిననుసరించి మంచి చెడ్డ మొదలైనవిగా మారును. మతిని దిద్ది తీర్చుటమే మతముల పర మోద్దేశము. దేశకాల పరిస్థితులననుసరించి వారి వారి గుణ కర్మల నాశ్రయించి పాత్రభేదములను ఆధారముగా పెట్టుకొని మతములు భిన్న భిన్నముగా కనబడిననూ, అన్ని మతములు చిత్త శుద్ధిని ప్రసాదించి ఏకత్వమును బోధించి హృదయస్థుడైన పర మాత్ముని సాక్షాత్కారమును సాధించేమార్గమును చూపించును. ఆ మార్గముననుసరించి ఆచరించి ఆనందించటమే మానవుల కర్త వ్యము, వారి జన్మసార్థకత.

ఆచరణరూపమైన ప్రచార ప్రబోధలవలన ఇట్టి మతమును స్థాపించిన జీసస్ క్రైస్ట్‌యొక్క జన్మదినమును ఒక Holiday గా, ఆహార విహారముల పండుగగా ఆచరించక. వారి దివ్య సూత్రులను మహత్తరమైన సదుపదేశములను హృదయమున హత్తుకొనేటట్లు చేసుకొనేదే వుత్తమమైన పద్ధతి.

ఈ నాడు ప్రపంచమంతా పట్టి మాటలతోనే కొన్నిరకము లైన యుక్తులతోనే పెద్ద తృప్తిని పొందుచున్నది. ఆడంబరము ఆర్భాటము వీటిలోనే ఆనందము నందుకొనుచున్నది. మహాత్ములు

అందించిన ఆశయములపై అలక్ష్యము ! వారి సూక్తులపై అనాదరణ !

క్రైస్ట్ ఒక క్రిశ్చియన్ మతీయులకేకాదు, పాశ్చాత్యులకే కాదు, మానవజాతికే గౌరవనీయుడు; మార్గదర్శకుడు. రాముడు కృష్ణుడు హిందువులకే, భారతీయులకే, క్రైస్ట్ క్రిశ్చియనులకే మొదలైన అల్పభావములన్నీ తుచ్ఛబుద్ధి కలిగినవారి అభిమతములే కానీ, విశాలమనస్కుల భావములు కానేరవు.

## దేహము, దేశము

వివిధ రూపనామములు, వివిధశక్తి సామర్థ్యములు కలిగిన అంగములతో కూడినది, ఒక దేహము; అట్లనే, వివిధ దేశములన్నీ చేరి, ఒక విశ్వము. దేహికి దేహమెంతనో, దేవునికి విశ్వమే తనదేహము ! చేతులు కాళ్ళు కన్నులు చెవులు తల కడుపు-అన్నీ చేరి పనిచేసినపుడే ఒక సజీవదేహము. అన్ని అంగములలోనూ అంతశ్శక్తిగా ఒక దైవానుగ్రహము ప్రవహించుచుండును. దాని బలమువలననే మనస్సు బుద్ధి ఇంద్రియములు ఇవన్నీ కర్మలనాచరించును. ఆత్మానుగ్రహమే జీవనాధారము. దానిని పట్టి చూచినపుడు, అన్ని దేహములలోని ఏకత్వము గోచరమగును. నామరూపములు అంగాంగములు వీటినిగమనించిన, భిన్నత కనబడిననూ, అంతర్యములోని ఈ ఆత్మతత్వమునకే ప్రాధాన్యత నీయవలెను. దేశదేశాల విషయము కూడ, అంతే.

కుటుంబ సభ్యులమధ్య, భిన్న భిన్న భేదములు లేచి, ద్వేషాసూయలు ప్రజ్వలించిన, ఆ కుటుంబముయొక్క ఆస్తి దుర్వినియో

గమ్మై, పరులపాలై, తప్పిపోవును. అట్లనే వివిధ దేశములతో కూడిన విశ్వకుటుంబములోని భావములు భిన్నమయిన, భగవదను గ్రహమనే ఆస్తి త్వరలో నష్టగుమను.

దేహమునుంచి ఒక హస్తమును విడదీసిన, రక్తస్రావమై ఆ అంగముకూడ క్షీణించి ప్రయోజనములేవిదగును. విభాగము వలన, అనుగ్రహమును కోల్పోవటమేకాక, వేరైన భాగము పాడై పోవు సంభవము కూడవున్నది. విశ్వమంతా సుక్షేమముగా నుండవలెనన్న, అనుగ్రహరక్తము అన్ని దేశములలోనూ అన్ని ప్రాంతములలోనూ, సమాజములలోనూ, అన్నివ్యక్తులలోనూ ఒకేరీతిగా ప్రవర్తించవలెను.

వృక్షమొకటి పెరుగి పెద్దదికావలెనన్న భూమి గాలి వర్షము అన్నీ అత్యవసరము. అయితే విత్తనం మాత్రము దానికి ప్రధాన ఆధారముగా వుండితీరాలి. అట్లనే జీవునికి కర్మము సద్భావము పుణ్యము ఇవి ఆధారములు; అయిననూ ఆత్మ అనే విత్తనము అన్నిటికన్న ప్రధానముకదా? భిన్నదేశీయులు భిన్నమతస్థులు భిన్నరూపములతో భిన్న భావములతో భిన్న భిన్నముగా ప్రవర్తించ వచ్చును. అయితే విత్తనమొక్కటే! కొన్నివృక్షములు జల హీనముగనూ కొన్నిపుష్టివంతముగనూ కొన్ని పొట్టిగనూ కొన్నిపొడువుగనూ పెరుగవచ్చును గాలి భూమి వర్షములనను సరించి; అయితే బీజరూపమున అన్నియూ ఏకమే,

## మూడు - చంద్రులు

చలించే నదీజలములో చలించే చంద్రుడు కనబడును; అదే సమయమున, చలించని కొలనులోని నీటిలో స్తంభించినట్టుగా చంద్రుడు కనబడును; ఆకాశమునందు సర్వసాక్షిగా నిర్గుణుడై ఒక చంద్రుడుంటాడు. జగత్తులో కర్మల నాచరించుచూ చలించు జీవి, నిశ్చల బుద్ధితో ధ్యానమందు మనస్సు ఇంద్రియములను అరికట్టిన యోగి, వీరిరువురూ ఆ జగత్సాక్షియొక్క ప్రతిబింబములే; ఉపాధియొక్క గుణమును పట్టి చలించినట్టు స్తంభించినట్టు తోచుచున్నవి అంతే. సర్వసాక్షియైన ఆత్మ నిర్గుణ నిరాకారుడే.

జీసస్ క్రైస్ట్ చలనబింబమును I am the messenger of God " (నేను భగవత్ కార్యమునకై వచ్చిన సందేశ వాహకుడను) అన్నాడు; స్థిరత్వము పొందిన తనలోని యోగి బింబమును గుర్తించి I am the Son of God (నేను భగవంతుని పుత్రుడు) అన్నాడు; ఆకాశమందు సాక్షిగావున్న నిరాకార తత్వమును పేర్కొని I and my Father are one (నేను నాతండ్రి ఇద్దరూ ఏకమే) అని ప్రవచించినాడు. అందరూ ఆత్మ స్వరూపుని ప్రతిబింబములే అనే సత్యమును గుర్తించి మానవ సోదరత్వమునూ దైవ పితృత్వమును అంగీకరించిన లోకకల్యాణమునకదే పునాదియగును. అదే సర్వమతసారము, సర్వమార్గముల లక్ష్యము; సర్వజీవుల గమ్యము. దీనిని గుర్తించక మానవులు అన్నిదేశములలోనూ అశాంతికి అక్రమ అన్యాయములకు

గురియై ఘోరప్రచారమునకు పూనుకొని జీవితమును అనర్థమార్గమున నడుపించుచున్నారు.

కాలమార్పువలన విజ్ఞానము విపరీతముగా ప్రభావించి విలపిల్లి వికసించటము వలన మానవుల మతిచెడి వారు మతసారమునకు విరుద్ధమైన మార్గములలోనే వర్తించుచున్నారు ఉదాహరణమునకు, తల్లి తండ్రులనాదరించి వారికి కృతజ్ఞతనందించవలెను. పెద్దల అనుభవ ధనమునందుకొని వారిని గౌరవించి అనుసరించవలెను, సత్యమునే పలుకవలెను. అన్యాయ అక్రమములనాశ్రయించకూడదని అన్ని మతములూ బోధించును.

అయితే తల్లితండ్రుల మాటలను తిరస్కరించటమే బుద్ధిమంతుల లక్షణమని, పెద్దలననాదరించటమే ఘ్యత అని, అసత్యమాడకున్న పురోగమించమని, అన్యాయ అక్రమములతోనే విజయము సాధ్యమని, యెవరికి వారు వాదించి సాధించుచున్నారు. నాబోధనే సరి అని ఇతరులందరూ తప్పుదోవనాశ్రయింతురని అందరూ విర్రవీగుచున్నారు.

భగవదాజ్ఞ

మతముయొక్క ఉద్దేశమేమి, మానవుని గమ్యమేమి, జగత్తు - జీవి - ఈశ్వరుడు వీటి నిజసంబంధమేమి, అని తెలుసుకొన్న, భేదభావములురావు. తాను విశ్వసించిన మతము యేదైనను దానిపై శ్రద్ధాభక్తికలిగి దాని క్రమశిక్షణలను ఆచరించిన వాద

వివాదములుండవు. గమ్యము చేరవలెననే ఆశ నెరవేరవలెనన్న విశ్వసించిన మార్గముననుసరించి ప్రయాణము సాగించెను. భగవంతుడు కావలెనన్న భగవంతుని ఆజ్ఞానుసారము వర్తించి వారినిచేరే మార్గమునుగుర్తించి ప్రయాణమునకు పూనుకోవలెను. ఒకగ్రామమును చేరవలెనన్న లేచి అచ్చటకు నడచిపోవలెను. గ్రామమే మీరు కూర్చున్నచోటుకు నడచిరాదు. అవతారము వచ్చినదే, ఇంక అన్ని చక్కగా జరుగును అని కూర్చున్న, ఫలము లేదు. అతని సన్నిహితము కావలెనన్న ఆజ్ఞలను పాటించినవారు అప్పుడు సన్నిహితుడవుతాడు.

జీసస్ క్రైస్టు అనేక ఆదర్శములనందించినాడు: సామాన్య మానవులకు దివ్యానుభూతిని కలిగించుకొరకు కొన్ని మహిమలను కూడ వారికి ప్రదర్శించినాడు. ఆసందరనమును గ్రోలేనిమిత్తము అనుసరించవలసిన ఆధ్యాత్మికమార్గమును బోధించినాడు. కరుణ త్యాగము ప్రేమ సంయమము సహనము మొదలైన సద్గుణములను ఆచరించి అభివృద్ధిచేసుకొని ఆనందమునందుకొండి అన్నాడు.

అశరీర వాణి

శిలపైన దేహత్యాగము చేసినాడు, అది ఆయనచేసిన పరమోత్కృష్టత్యాగము క్రిస్టును స్తుతించేది వాడుక. అయితే, జీసస్సును పదిమంది చేరి బంధించి హింసించినారు. కానీ, తానుగా ఆచరించిన త్యాగము కాదద, జీసస్సు చేసిన త్యాగము అదికాదు,

అతని జీవితమే త్యాగజీవితము. తన సుఖమును తన ఆనందమును త్యాగము చేసి, పరుల బాధని వారణకొరకై పంచ ప్రాణములనర్పితము గావించినాడు. అహంకారమును మమకారమును త్యాగము చేసినదే అన్నిటికన్న మహాత్యాగము. దేహవాంఛలను త్యాగముచేసేది మహత్తరమైన త్యాగము. అపకారమొనసగిన వాళ్ళకు ఉపకారముచేసేది కూడ గొప్ప త్యాగశీలమే. కాబట్టి, ఇట్టి త్యాగ జీవితమునాచరించిన జీసస్సు జన్మదినమందు దీనులనాదరించి దలితుల శుశ్రూషకు పూనుకొనవలెను.

జీసస్సు ప్రబోధించిన మతములో భేదభావములను పురస్కరించుకొని, తెగలుద్భవించి, ద్వేషాసూయలు పెరిగినవి. అయితే, క్రైస్తవమతము ఏకత్వమునే నొక్కి వక్కాణించినది. జీసస్సు శిలపై బాధపడుచున్న సమయములో, తన్ను హింసించినవాళ్ళపై సహజముగనే కోపోద్రేకము చెలరేగినవి. ఆ తక్షణమే ఒక అశరీరవాణి బయలుదేరి, ALL LIFE IS ONE, MY DEAR SON! Be alike to every one'' (జీవరాశులన్నీ ఏకమే; ప్రేమపుత్రుడా! అందరినీ ఏకదృష్టిచే చూచి ఏకత్వముగా భావించు'' అని బోధించినది. DEATH IS THE DRESS OF LIFE'' (దుస్తులుమార్చేదే మరణము) అని హెచ్చరించినది.

## సహజ గుర్తులు

మహాపురుషుల జీవితోద్దేశము ఏకత్వమును బోధించి ప్రజాక్షేమమును లోకకల్యాణమును సాధించేదే. జీసస్సు జన్మించిన

ముహూర్తమందు, ఆ అర్ధరాత్రి సమయమున, గగనమునుంచి ఒక నక్షత్రము పడినట్టుగనో వాలినట్టుగనో కథలు చెప్పుచున్నారు; దానిని కనుగొని ఆ గ్రామమునకు టిబెట్ దేశస్థులు ఇతరులు కొంతమంది వచ్చిరనియూ కథలున్నవి. ఈ కథలను పఠించటము విశ్వసించటము కూడ జరుగుచున్నవి. అయితే నిజఘటనలు అట్టివికాదు. నక్షత్రములు రాలవు; జారిపడవు.

తనరాష్ట్రములోని ప్రతిగ్రామములోనూ జనాభా ఎంతఅని లెక్కచేసి కనుగొనవలెననే వుద్దేశముతో రాజు ఆజ్ఞ యిచ్చాడు. మేరి, మేరి భర్త ఇద్దరూ స్వగ్రామమునకు ఈ ఆజ్ఞను పాలించేకొరకు ప్రయాణమైరి. వారిద్దరూ ఆ గ్రామములోనే జనాభాగణన జరుగే దినము వుండాలి. అయితే దోవమధ్యన మేరికి ప్రసవవేదనలారంభమయ్యెను. క్రొత్తవూరు: పరిచితులెవ్వరూలేరు. ఒక ఆవుల కొట్టములో రెండావులమధ్య కొంతస్థలమును శుభ్రపరచి, మేరిని అక్కడ పరుండమనిచెప్పి భర్త ఆ మధ్యరాత్రి సమయమున యెవరైనా ఆడవాళ్ళు సాయమునకు దొరకుదురా అని చూచుచూ నిలచినపుడు ఆయనకు శిశువుయొక్క ఏడ్పువినపడింది; ఆదేసమయమున, చిమ్మ చీకటిలో పడి అజ్ఞానాంధకారమువలన అన్యాయ అక్రమ అసత్యములపాలైన లోకమునకు జ్ఞానజ్యోతిని ప్రసాదించే మహాపురుషుని అవతారమయినది అనే గుర్తుగా, ఆకాశమున విశేషమైన వెలుగు బయలుదేరినది; యెప్పుడూ ఇంతే. అంధకారము నాశనమగు దినము: జ్ఞానజ్యోతి జన్మించిన దినమనే దానికి ఒక మహత్పూర్ణగుర్తు: అవతారజనన సమయమున ఇట్టివి జరుగేది సహజము.

## అర్పణ దృష్టి

కర్తవ్యకర్మలను అర్పణబుద్ధితో నెరవేర్చిన, చిత్తశుద్ధి కలిగి భగవత్సాక్షాత్కారము సులభమగును. ఇదితప్ప రెండవమార్గములేదు. ధనబలము బుద్ధిబలము అధికారబలము యేవీ పనికిరావు ఒకప్పుడు ధనము జ్ఞానము రెండింటి మధ్య పెద్దజగడము బయలుదేరినదట, నావలనపొట్ట నింపుకొని ఆరోగ్యవంతుడై నువ్వు తెలివిని సంపాదించినావు అని ధనము, నేను లేక ధనమున్న ఏమి దాన్ని నార్జించేదేరీతిగా అనేదే తెలియదే? అని జ్ఞానము వాదించిందట. అపుడు వారిమధ్యన ఆత్మవచ్చి, దుర్వినియోగము జేసిన మీరిద్దరూ చెడ్డ, సద్వినియోగము చేసిన ఇద్దరూ మంచి అని సమాధానము తెచ్చినదట. వినియోగవిధానమే ముఖ్యము. జ్ఞానములేక ధనము ప్రమాదకరము; ధనములేక జ్ఞానమురాణించదు. ఇతరుల బాధనివారణార్ధము ధనమును వినియోగించాలి, ఇతరుల సుఖదుఃఖములను లెక్కచేయక జ్ఞానమును దుర్మార్గములో వినియోగించిన, భయభీతులు పెరుగును.

క్రిస్టమస్ పండుగనాడు క్రీస్తుయొక్క పవిత్రభావములను దయా ప్రేమ సహనము పరోపకారబుద్ధి వీటిని - ఆచరణలో పెట్టుకొనే నిర్ణయము చేసుకోవలెను. అట్లుచేయక, మధ్యరాత్రి దీపాలువెలిగించి, క్రిస్టమస్ ట్రీ అని ఒకదానిని యేర్పాటు చేసుకొని తరువాత త్రాగటము నృత్యముచేయటము ఈ కార్యక్రమములతో శ్రద్ధ చూపించుచున్నారు. ఆనందమైన ఈ సుదినమందు

బాగా త్రాగి తుచ్ఛమైన ఆనందము నందుకోవటమా ? మానవత్వ మునే మరపించు ఆ వైను దేవత్వమునకు కొనిపోవునెట్లు ? మొట్ట మొదట మానవుడు వైనును త్రాగువాడు; త్రాగిన వైను మరిమరి వైనునే ఆపేక్షించి మరిమరి త్రాగును; చివరకు, వైను ఆ మానవుణ్ణి త్రాగివేస్తున్నది. ఇది త్రాగటముయొక్క దుఃఖమయ కథ - బాట్లు లోనికిపోతున్నది; తరువాత దాన్ని త్రాగినవాడే ఆ బాట్లలోపల చిక్కుకొని బయటకువచ్చేది సాధ్యముకాక అవస్థ పడు తాడు. ఇది కథ.

భవిష్యద్వాణి

ఇంకొక ప్రధానమైన విషయమును మీకుగుర్తుకు తెప్పించ వలెననుకున్నాను. జీసస్సు కాయమును వదలిపెట్టి ఆత్మతత్వ ములో లీనమయ్యే సమయమందు తన అనుచరుడొక్కనికి జాన్ అనే ఆయనకు ఒకమాటను చెప్పిపోయినాడు. ఆ మాటకు భిన్న భిన్న మార్గములో నానార్థములను కల్పించి వ్రాతను అభివృద్ధిపరచే వ్యాఖ్యాతులు, దాని సత్యమే అడుగంటిపోవునట్లు పెద్ద సమస్యగా పెంచినారు. కానీ, దాని నిజార్థము చాలా స్పష్టముగనే వున్నది.

"నేను పోయినను మీరు చింతించనక్కరలేదు; కాల కారణములు ఒదగి వచ్చినపుడు, నన్ను సృష్టించినవాడే మరి వస్తాడు; లోకమున అవతరిస్తాడు" అన్నాడు, క్రైస్ట్. అక్క డున్న ఒక గొర్రె పిల్లను చూపించి, "ఈ పేరుతో (LAMB) వస్తాడు" అన్నాడు. అంటే, LAMB అనే ప్రాణిగా గాదు గొర్రెపిల్లయొక్క ధ్వనియేమిటి? బా బా BA BA అనికదా? బాబా పేరుతో, ఈ రూపముతో వస్తారని అర్థము. మరియు

ఆ అవతారముయొక్క పేరు సత్యము (TRUTH) అని, ఆయన వామనుడని, కేశరాశి కిరీటముతో వుందురని, యెఱ్ఱటి రక్తపు కలర్ రోబు (blood red robe), (ఇట్లాది) ధరింతురు, అని వివరములను కూడ ఆయనకు బోధించి జీసస్సు మాయ మైనాడు. ఈ సత్యమును మీకు ఇంతవరకు తెలుపలేదు. అయితే మీఅందరిలోనూ సాయివున్నాడు అని నేను హెచ్చరించుచున్నాను కదా? ఆ మాటకు ఇదే అర్థము. రక్తపు కలర్ గౌను వేసికొని, పొట్టిగా, కుటిలకుంతల కేశరాశి కిరీటముతో మీ మీ హృదయ పీఠమందు బాబా అనే పరిశుద్ధమైన నిర్మలమైన పవిత్రమైన LAMB దివ్యస్వరూపమున్నది అనేది మీ నిజతత్వము. ఇదే అవతార తత్వము; అవతారము బోధించే తత్వము.

ఈశ్వర స్సర్వ భూతానాం, ఈశావాస్యమిదం సర్వం - వాసుదేవ స్సర్వమిదం ః భారతీయ సంస్కృతియొక్క దివ్య సందేశమిది. భగవత్తత్వము ప్రత్యేకముగా వుద్భవించి అంత రించునదికాదు. హృదయములో సదా సర్వత్ర నిండిన చైతన్య మే అది. అందరిలోనూ అన్నిదేశములలోనూ, యెపుడూ వున్నది అది ఒకటే.

ఉండేది ఒకే దేవుడు; సర్వాంతర్యామి; ఉండేది ఒకే మతము, ప్రేమమతము; ఉండేది ఒకేజాతి, మానవజాతి; ఉండేది ఓకే భాష; హృదయభాషః ఆ ఏకత్వమును సాధించ; ఐక్యతలో ఆనందించండి.

ప్రశాంతినిలయం శ్రీవారి క్రిస్టమస్ సందేశము 1972

# శ్రీసత్యసాయి సత్సంగసమాచారములు

25-12-72 ప్రశాంతినిలయం: శ్రీవారి క్రిస్ట్మస్ సందేశము.

28-12-72 మారవాణినగర్: శ్రీసత్యసాయిస్టడి సర్కిల్: గ్రంథాలయ ప్రారంభోత్సవము: డా॥వి.కె.గోకాక్ గారిచే.

31-12-72 బండారర్లాంక (తూ॥గో॥జిల్లా): స్వామి కారుణ్యానంద గారిచే ఉపన్యాసము. బాలవికాస్ పిల్లలచే "ధర్మవిజయం" నాటిక. *తిరువారూరు (తంజావూరుజిల్లా): సమితి: 7వ వార్షికోత్సవము. అధ్యక్షత: డా॥బాలసుబ్రమణ్యం, M.D. బాలవికాస్ పిల్లలచే "మార్కండేయ" నాటిక.

1-1-73 :బృందావనం (వైట్‌ఫీల్డ్): శ్రీవారి 'నూతన సంవత్సర సందేశము".

:భువనేశ్వరం (ఒరిస్సా): స్టడిసర్కిల్ 3వ వార్షికోత్సవము: ఉపన్యాసకులు: డా॥బి బితాోనందమహంత్రి, ప్రొ॥డా॥హరిహరదాస్

7-1-73 :భారత్ యెలక్ట్రానిక్స్: నగరసంకీర్తన: 3వ వార్షికోత్సవము

13-1-73 :బెళ్తంగడి(ద.క.జిల్లా):సమితి: సంక్రాంతి సభ: ప్రొ॥ విశ్వామిత్రగారిచే ఉపన్యాసము,

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను చార్జీలను మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోష్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్ పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోష్టుచార్జీ మరియు, ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను చార్జీ రూ. 1-05పై జతపరచి, కావలిసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| తెలుగు:—— | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-55 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-21 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. | గీతాభావ ప్రకాశము | 15-00 | 1-00 |
| 12. | బోధామృతము | 0-50 | 1-00 |

| | | |
|---|---|---|
| 13. దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 14. స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |
| 15. దివ్యజ్ఞానదీపికలు | 0-75 | 0-20 |

కన్నడం:——

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | |
|---|---|---|
| 1. జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2. 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. అవతారమాహాత్యం | 0-50 | 0-15 |
| 5. ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. వాచోరత్నంగళ్ | 3-00 | 0 30 |
| 8. ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు ..——

| | | |
|---|---|---|
| 1 సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0 30 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (3భా) | 4-00 | 0-30 |
| 3. | ,, .. (4భా) | 5-00 | 0-40 |
| 4. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| 5. | సాయిబాబ (అమేరికన్ ఎడిషన్) సత్యం శివం సుందరం (1వభా) | 6-00 | 0-30 |
| 6. | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 7. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 8. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 9. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 10. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 11. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 12. | భజన్‌సాంగ్స్ | 2-00 | 0-20 |
| 13. | ధ్యానవాహిని | 2-00 | 0-15 |

అరవం:————

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ బా) | 3-50 | 0-40 |
| 4. | .. .. .. (2వ బా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయివా[illegible] | 1-00 | 0-10 |

| | | | |
|---|---|---|---|
| 9. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 11. | జ్ఞానవాహిని | 1-50 | 0-20 |

హిందీ:-

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:-

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 4-00 | 0-35 |
| 2. | సందేహ నివారిని | 2-50 | 0-30 |

గుజరాతి:——

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కథాసుధ | 2-00 | 0-15 |
| 3. | ధర్మ వాహిని | 1-50 | --20 |
| 4. | సత్యం శివం సుందరం | 4-00 | 0-35 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

మేనేజర్, సనాతన సారథి.



## గమనిక — పత్రికల చందాలు. పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4రు|| ఒక సంవత్సరమునకు తక్కువకాని 5 సం||ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

2. చందాలనుపంపించునపుడే ఈక్రింది వివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలను పంపేవారు "క్రొత్త చందాదారు", అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడుగించుటకు, తనచందా నెంబరును చందాపంపించు సమయమునందే తెలియజేయవలెను.

సి) తెలుగు పత్రికకావలెనో లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగా వ్రాయవలెను.

డి) చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను. M.O. ద్వారా చందానుపంపించువారు వారి పేరును పూర్తి విలాసమును M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. M.O. ద్వారా పైకమును పంపించువారు కూపనులోనేకావలసినపుస్తకముల వివరములను తెలియజేయవలెను.)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాప్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను. "సనాతన సారథి", ప్రశాంతినిలయం పోస్టు. అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకిఖర్చులనుకూడా కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక, పుస్తకములుగాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5. పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతనసారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా. ఆంధ్రప్రదేశ్ అనుచిరునామాకు వ్రాయవలెను అట్లువ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమచందానెంబరును లేక బుక్ ఆర్డరునెంబరును, తప్పక వ్రాయవలెను, అట్లు వ్రాయనియెడల జవాబుఇచ్చుటకు ఆలస్యమగును.

6. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా ప్రశాంతినిలయము నందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయము నందు యన్. కస్తూరి గారిచే ముద్రింపబడి బి.వి.రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి ట్రస్ట్ తరపున ప్రచురింపబడినది. ఎడిటర్, యన్. కస్తూరి యం. ఏ. బి. యల్.